REG.No.M.2185 REG.No.N.45

The First Teulgu Bi-weekly in Andhra Desa, The only Telugu News Paper for H E H The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును

హైదరాబాదు-దక్కను

10130 GOLAKONDA PATRIKA. HYDERABAD Dn.

సంపుటము ౫ | ప్రమోదూతనామ సంవత్సర శ్రావణ బ॥ ౪ బుధవారము 13-8-30 | సంచిక ౨౭

# కాంగ్రెసు నాయకుల విచారణ

## ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు తీర్పు

మాలవ్యాగారికిని, కొందరు నాయకులకును రు ౧౦౦ ల జుర్మానా లేకున్న ౧౫ దినముల శిక్ష అనుభవించ వలయును.

పటేలు గారికిని, ఇతర వర్కింగ్ కమిటి సభ్యులకును, మూడు నెలల శిక్ష విధింప బడినది

మాలవ్యాగారు జైలుకు వెళ్లుటకే నుద్దేశించిరి

### వాయిదా అనంతరము

ప్రధాన రాజధాని మేజిస్ట్రేటుగారు కాంగ్రెసు నాయకులగు పండిత మదనమోహన మాలవ్యా వల్లభభాయి పటేలుగార్లపై బొంబాయి పోలీసువారిచే తేబడిన కేసులో తీర్పు వినిపించుటకు అగస్టు ౧౧ వ తేది వాయిదా వేసియుండిరిగదా. మాలవ్యా పటేలుగార్లు కోర్టు వెలుపలికిపోయి వెంటనే మరలివచ్చిరి. మాలవ్యాగారు మెజిస్ట్రేటుగారితో జాల్జి నారాయణజీ మోడీగార్లను సాక్షులుగ పిలిపించవలయునని కోరిరి కాని యీ విన్నపమును మెజిస్ట్రేటు నిరాకరించెను

అంతట పటేలుగారు మాలవ్యాగారియొక్కయు తమయొక్కయు కేసును వేరువేరుగ చేయుటకు వీలుకలదాయని న్యాయాధికారిని ప్రశ్నించిరి. వారిపుడు వీలులేదని జవాబిచ్చిరి

### శిక్షలు

అగస్టు ౭ వ తేదిన రెండుగంటలకే మెజిస్ట్రేటు ఈకేసులో తీర్పువినిపించెను మెజిస్ట్రేటు పండిత మాలవ్యాగారికిని మణిబెహనుపటేలు రత్నజీను గార్లకును ఇరువురు స్త్రీలకును రు ౧౦౦ ల జుర్మానా విధించెను జుర్మానా చెల్లించనిచో ౧౫ దినముల విడిశిక్ష అనుభవించవలయును వల్లభభాయిపటేలు జయరాందాస్ దౌలతురాం షేర్వాని వార్లీకరు గార్లకు మూడునెలల విడిశిక్ష విధించెను పండిత మాలవ్యాగారు వృద్ధులగుటచేతను వారికి సత్యాగ్రహ మొనర్చు నుద్దేశము లేనందునను తక్కువ శిక్ష విధించితినని తెలిపిరి

### మెజిస్ట్రేటుగారి తీర్పు

ప్రజలలో బహిరంగసభలు జరుపుటగూర్చియు, ఊరేగింపులు తీయుటగూర్చియు, కొన్ని అపోహములు గలవని విదితమగుచున్నది. ప్రజల ప్రాథమిక హక్కులగూర్చి ఇచట వివరించుటకు నా కవకాశములేదు. ప్రజల ప్రాథమిక హక్కులు దేశమునందలి శాంతిని భంగపరచనిమాత్రము మనచట చెప్పుట చాలును. ప్రజలకు హానికరములైన చట్టముల గూర్చి శాసనములు చేయుటకు ప్రపంచమందలి అన్ని శాసన సభలలో ప్రయత్నింపబడెను. కాని కొన్ని చట్టములు ఒకచో నిరపాయములైనవిగనుక వేరొకచో ప్రజలకుహానికరముగ నుండును. శాసనసభలు ఒక సందర్భములో కలుగు పలువిధములైన ఫలితములను గమనింపజాలవు. ఒకచట్టము పూర్తిగ నిరపాయకరమైనదియే అయినను, కొన్ని సమయములందు దానివలననే ప్రజాశాంతికి భంగము కలుగును;

మాలవ్యాగారు పోలీసు కమిష్నరుకు ఊరేగింపు కాలము పోవు మార్గము నిర్ణయించుట కధికారము కలదని చెప్పియున్నారు. ఈ అధికారమును కమిష్నరు దుర్వినియోగము చేయరాదని వారు వాదించిరి. కమిష్నరు అట్లు అన్యాయముగ నడచెనని రుజువుపరచుటకు నావద్ద యెట్టి ఆధారములు లేవు. హంస మెహతాగారికి కమిష్నరు వ్రాసిన లేఖ ఆజ్ఞాపత్రము కాజాలదని మాలవ్యాగారు వాదించిరి. కాని ప్రాసిక్యూటింగ్ ఇన్స్పెక్టరుగారి వాదము వినినపిదప ఆలేఖ పోలీసుచట్టము ౨౩ వ సెక్షను ప్రకారము జారీచేయబడినదని తెలిసికొంటిని. ఈ సెక్షను ప్రకారము నొక ప్రత్యేకరూప మవసరము లేదు. కమిష్నరు యూరేగింపు మార్గము సూచింపుము నోటితో నైకాని వ్రాతమూలకముగాని ఆజ్ఞ నివ్వవచ్చును. "నేను తెలుపకోరుచున్నాను" అను వాక్యము యున్నంతమాత్రమున లేఖయని తలచ కూడదు.

### మాలవ్యాగారి నిశ్చయము

మీరుపత్రికా విలేఖరితో తీర్పుగూర్చి చెప్పుచు మెజిస్ట్రేటు పొరబడెననియు, తనకు హెచ్చుశిక్ష విధించవలసి యుండెననియు తాను కమిష్నరు ఆజ్ఞ క్రూరమైనదని తలంచియే యుల్లంఘించుటకు పూనుకొంటిననియు, అవసరమగుచో మరల నిట్టిపనులు చేయుదునని తెలిపిరి.

[మూడవ పుట చూడుడు]

(మొదటిపుట తరువాయి)

మాలవ్యాగారును, స్త్రీలును జుర్మానా చెల్లించుటకు నిరాకరించిరి. వీరు జైలుశిక్ష అనుభవించుటకే నిశ్చయించుకొనిరి. మాలవ్యాగారి కుమారులగు గోవింద మాలవ్యాగారు ఎవరైన జుర్మానా చెల్లించిన నంగీకరించరాదని మేజిస్ట్రేటుకు తెలుప వారు తప్పక నంగీకరించెదమని జవాబు నిచ్చిరి.

### పటేలుగారి సందేశము

పటేలుగారికి శిక్ష విధింపబడగనే వారు మౌలానా అబ్దుల్ కలాం ఆజాదు సా॥ అధ్యక్షులుగ నియమించిరి. వారు దిగువ సందేశము నొసగిరి:—

బొంబాయి పౌరులు తిలకు వర్ధంతి సందర్భమున చేసిన ఘనకార్యమును నేను ప్రశంసించుచున్నాను. లాఠీలు ప్రయోగించుటకు మున్ను మమ్ము వేరుచేయుటచే ప్రజల సుభవించిన బాధలలో మేము పాల్గొన జాలక పోయితిమి. బొంబాయి వలంటీరుల ఓర్పును నేను ప్రశంసించుచున్నాను. బొంబాయి పౌరుల వాక్కునకై తన ప్రాణములు గోల్పోయిన హరిగోవింద లాఖ్లే గారిని అభినందించుచున్నాను. బొంబాయి వలంటీరులును, పౌరులును, సమరమును, నిర్విఘ్నముగ అహింసా దీక్షను బద్ధులై నడిపెదరని నమ్ముచున్నాను. దేశీయులందరిని కాంగ్రెసు నేర్పరచిన కార్యక్రమమును కొనసాగించుటకు కోరుచున్నాను. ముందు ఇంతకన్న హెచ్చు పరీక్ష జరుగును. ఏరాష్ట్రము ఆరాష్ట్రబలము తనకే నిలచి సమరము సాగించవలయును. లాఠీల దెబ్బలు మనకు మృత్యుభీతి తొలగించుచున్నవి ఈ మార్గమే మనల గమ్యస్థానమునకు చేర్చును.

### మాలవ్యాగారి సందేశము

స్త్రీపురుషులార! ఇది మన పరీక్షాకాలము ప్రజలలో గల స్వాతంత్ర్యకాంక్ష, ఆత్మత్యాగము స్వాతంత్ర్యము సంపాదించుటకుగల నిశ్చయము మనల అగౌరవపరచుచున్నట్టి చెడుప్ప ప్రభుత్వమునకు మారుగ స్వరాజ్యము స్థాపింపబడునని ఆశ కలిగించుచున్నవి. స్వరాజ్యమనగా ప్రజలయొక్క ప్రభుత్వము ప్రజలచే ప్రజలకొరకు స్థాపింపబడినది మనదేశమునకు మనమే యజమానులము. ఆంగ్లేయులు వారిదేశమున నున్నట్లు కొలదిరోజులలో కాగలము. సమరము సాగించుడు. పరీక్షకై భీరువులవలె నిలువుడు మాతృదేశ సేవ జేయుచున్నప్పుడు కలుగు కష్టములను భరించుడు. మనయుద్దేశము నెరవేరునంతవరకు ఒక నిమిషమాత్రమైనను సమరము నాపకుడు అన్నిటికన్న విదేశవస్త్ర బహిష్కారము బాగుగ సలిపి ఖద్దరు స్వదేశీ వస్తువుల ప్రచారము చేయుడు మాతృదేశ స్వాతంత్ర్యమునకై అవసరమగు త్యాగములు చేయుడు మనదేశమును తన గౌరవమును తనబిడ్డల గౌరవములో కాపాడుకొని ప్రపంచమందలి నాగరిక జాతులలో నిలచునట్లు జేయుడు.

## అధిక ప్రసంగాలు

అగస్టునెల ౧ తేదిన గుల్బర్గా పట్టణమున ఒకచిత్రం జరిగింది. ఏమిటంటె అక్కడివారు తిలకువర్ధంతి చేయదలచి అంతకుముందు కొన్ని రోజులకు ఆనాడు బహిరంగసభ చేస్తామని అవ్వలుతాలూక్దారుదగ్గర దరుఖాస్తు యిచ్చినారట. నాటిసభకు గుల్బర్గా సూబేదారులు అధ్యక్షులుగ నుంటారని తెల్పినారట ఇంతేకాదు ఉపన్యాసకులు తిలకుగారి రాజకీయాభిప్రాయాలగూర్చి మాటి మాసుకుంటారని ఆయనచేసిన భాషాసేవ సాంఘికసేవగూర్చి మాట్లాడుతారని తాలూక్దారుగారికి విన్నవించుకున్నారట అయినను తిలకుగారిపేరు జెప్పగానే కలిగిన భీతాహంమాత్రము మన తాలూక్దారుగారికివదలలేదట వారు కడుదీర్ఘముగా ఆలోచించి ఇట్టి సభ చేయుటకై ఆజ్ఞప్రసాదించుటకు వీలులేదని వ్రాసినారట దరుఖాస్తుయిచ్చినవారు చేయునదియేమి లేక తలవంచుకొని పోయినారట

* * * *

ఇంతటితోనే సమాప్తం అయినదనుకున్నారా? కాదు అగస్టు ౧ తేదిన నిశ్చితకాలమునకు సూబేదారు సా॥ సభాజరుగు స్థలమునకు విచ్చేసిరి వారికి తాలూక్దారు గారి ఆజ్ఞాపత్రము చూపగ వారు ఈఆజ్ఞను ధిక్కరించాలని చెప్పి సభా ప్రారంభము చేసినారట. వీరితోకూడ ఎందరో అధికారులు వచ్చినాటి సభయందు పాల్గొనిరట. చూచితిరా ప్రజలకే కాకుండ ఒక సూబా అధికారికికూడ తనక్రింది జిల్లాధికారి యిచ్చిన ఆజ్ఞ అన్యాయంగా తోచింది. ఇట్టి ఆజ్ఞను ఉల్లంఘించి ప్రజలకు తోడ్పడినట్టి గుల్బర్గా సూబేదారుగారు ప్రశంసనీయులు, అధికారులంటె ఈలాంటివారుండాలె అప్పుడే మనదేశం బాగుపడుతుంది.

* * * *

ఈకాలంలో గ్రంథకర్తల సంఖ్య మిక్కుటము మగుచున్నది అందుచే ప్రెస్సులకు కూడా బాగానే పనిదొరుకుతూ వుంది గ్రంథకర్తలలో మూడురకాల వారున్నారని చెప్పవచ్చు స్వయంగ కృషిసలిపి దేశాభివృద్ధికి, భాషాభివృద్ధికి, తగినగ్రంథములు వ్రాయువారు మొదటి రకమువారు. ఇతరులుకృషి చేసివ్రాసిన గ్రంథములను తర్జుమాచేసి ప్రకటించువారు రెండవరకమువారు. ఇక మూడవ రకమువారెవ్వరంటె ఇతరులు వ్రాసిన గ్రంథములలో కొన్ని మార్పులుచేసి ప్రకటించువారు ఈరకమువారు మన రాష్ట్రములోకూడ లేకపోలేదు వీరుచేయు భాషాసేవయును యేమని ప్రశంసించాలనో నాకు తెలియదు వారిని పొగడుటకు నాకేదిక్కులు. ఒకానొకప్పుడిట్టివారు కోర్టులకెక్కి కీర్తికూడ గడిస్తారు పత్రికల్లో పేజీలకు పేజీలు వీరిగూర్చి వుంటుంది వారిఅదృష్టం యేమని చెప్పాలె!

* * * *

బరోడాశాసనసభయందు విడాకుల చట్టము గూర్చి చర్చలు జరుగుచుండ మనరాష్ట్రంలో వితంతు వివాహము చేసికొనినవారి ఆస్తిగూర్చిన చట్టమును చేయుటకు మన శాసనసభ్యులు వెనుకముందు ఆలోచిస్తూ వున్నారు. ఇట్టిచట్టము యొక బ్రిటిష్ ఇండియాయందేకాక బరోడా మున్నగు కొన్ని దేశీయ సంస్థానములలో చట్టము చేయబడి అమలునందున్నది దీనినిబట్టిచూడ మన దేశీయులు మన శాసనసభ్యులు అంతా చాల వెనుకబడియున్నామని ప్రపంచానికి తెలియకపోదు మనవిద్యాస్థితే బాగులేనప్పుడు మనవారికి నూతన అభిప్రాయాలు యెట్లు కలుగుతావి కొందరికి కలిగిన అధికసంఖ్యాకులు విన్వరానివారు కనుక వారికి క్రొత్త అభిప్రాయాలు యెట్లా గిట్టుతాయి ఇదే సంఘ సంస్కరణానికి అడ్డంగావున్నది లేకుంటె మనవారుకూడ ఇతర రాష్ట్రాలవారివలె పరుగెత్తెడివారే

* * * *

"హాయె మనపట్నంపోయె" అని వదంతి బయలుదేరినవారికి తుదకు వారిమాటనె పోయింది గోలకొండ పత్రికా స్వకీయ జ్యోతిష్కులు సూచించినది నిజము తేలింది ఈప్రకారం యెవరో జ్యోతిష్కులను అబద్ధీకులని రుజువుచేయుటకు బదులుదేర దీసిన దాని వలె తోస్తుంది. ఈవార్తవిని కొందరు పట్నం విడిచేటందుకు సిద్ధంగాయి వుండిరట కాని కోత్వాలుగారి ప్రకటనజాలి కొంతధైర్యం కలిగించట లేకున్న యేమయియుండేదో యెవరికెరుక?

---

గోలకొండపత్రిక

ప్రమోదూత నామ సం॥ శ్రావణ బ॥ ౮

బుధవారము

# ప్రజాపక్ష విద్యామహాసభ

ప్రజాపక్ష విద్యామహాసభ ప్రథమ సమావేశము ౧౩౩౯ ఫ ఆజూరు నెల ౨౦, ౨౧ తేదులయందు జరిగియుండెను. ద్వితీయ సమావేశమును సకాలమునకు జరుపుటకు కార్యనిర్వాహకులు సర్వసన్నాహములు చేసిరి. కాని ప్రభుత్వమువారినుండి సభాధ్యక్షులు ఈరాష్ట్రమునకు రాకూడదను ప్రతిబంధకము కలుగుటచే ఆలస్యమునకు కారణమయ్యెను. కార్యనిర్వాహకులు కోరికపై దయామయులును, విద్యాప్రియులును, అగు మన ప్రభుత్వము వారు పునరాలోచించి సభకనుమతి నొసంగిరి. ఇక సమావేశము ఈనెల ౨౦, అబాన్ నెల ౧ తేదులయందు జరుగును. అధ్యక్షులు పూర్వ మెన్నుకొనబడిన డాక్టరు రాజ్రపసాదు శ్రీవాస్తవగారే.

సభా సమావేశమగుటకు మూడు వారముల గడువు మాత్రమే కలదు. అందుచే సమావేశము గూర్చి ప్రచారము సలుపుటకు కార్యనిర్వాహకులకంత అవకాశము లేదు. గతసమావేశమునందు జరిగిన విషయములను బట్టియు, ఇపుడు జరుగవలసిన పనులను బట్టియు, సభాప్రాముఖ్యతను దేశీయులకు తెలియక పోలేదు. గతసమావేశమునందు ఆంధ్రులు అధిక సంఖ్యాకులు పాల్గొని సభను జయప్రద మొనరించిరి. అదేవిధముగ నీసంవత్సరము అన్ని జిల్లాల వారును సభలో పాల్గొనెదరని మేము కోరుచున్నాము.

గత సమావేశము జరిగినపిమ్మట మనరాష్ట్రము యొక్క విద్యాసమస్యలగూర్చి యెన్నియో విషయములు బయలుదేరినవి. మనప్రభుత్వము వారన్ని సభలకు తమ అనుజ్ఞ నైకొనవలయునని ప్రకటించిరి. ప్రభుత్వమువారు విద్యావిషయక సభలకనుమతి నొసంగు చున్నను, అనుజ్ఞకై ప్రయత్నించుటలో కాలహరణమగుచున్నది. సభల గూర్చి జిల్లాల తాలుకాదారులును, కొత్వాలు గారును విచారించుటయేగాక ఈ సాధారణ విషయము గూర్చి ప్రభుత్వసభవారి అమూల్య కాలముగూడ వ్యర్థమగుచున్నది. మహాపురుషులయొక్కయు, దేశభక్తులయొక్కయు, వర్ధంతులు మున్నగునవి జరుపుకొనుటకాటంకములు కలుగుచున్నవి. దేశీయులలో ఈవిషయము, నెడ ప్రభుత్వముపై అసమ్మతి వ్యాపించుచున్నది. కనుక ఈగస్తీ నిరద్దు చేయించుటకు మనముగట్టి ప్రయత్నము చేయవలసియున్నది.

ఇంతియగాక ఇటీవల భారతదేశ రాజ్యాంగ సంస్కరణములు సూచించుటకై నియమింపబడిన సైమన్ కమిషన్ వారుమనరాష్ట్రవిద్యాపరిస్థితులు హీన దశయందున్నవని సూచించిరి. మనరాష్ట్రము స్వదేశసంస్థానములలో నాయకమణియైనను, విద్యావిషయమున చాల వెనుకబడి యున్నదని అభిప్రాయపడిరి. ఇది దేశాభిమానులకును విద్యాభిమానులకును విచారము కలిగింపక మానదు. ఇట్టిదుస్థితి తొలగించుటకు మనమేమి చేయవలయునో ఆలోచింపవలసియున్నది. నిర్బంధ విద్యావిధానమింతవరకు ప్రభుత్వమువారాచరణమునకు దేనులేదు. దీనిని వెంటనే అమలు జరుపవలయునని కోరవలసియున్నది. లేనిచో మనము ఇతరరాష్ట్రములవారితో సమానులము కాజాలము.

లోగ మేము విద్యాస్థితిగూర్చివ్రాయుచు దెలిపినట్లు ప్రభుత్వమువారు యేటేట ౭౦ లక్షలు వెచ్చించినను విద్యాప్రచారము తగువిధమున జరుగుటలేదు. దీనియందేమి లోపముకలదో, ప్రభుత్వమును, ప్రజలను,నిర్వహించవలసిన బాధ్యతలేవియో కనుగొనవలసి యున్నది దేశమునందలి అన్ని సమస్యలలో విద్యాసమస్య ముఖ్యమైనది దేశాభివృద్ధికివిద్యయే ప్రధానము. విద్య బాగుగప్రచారము కానిది రాజకీయ సాంఘిక, ఆర్థిక, సమస్యల పరిష్కారము కాజాలదు. కనుక నీవిషయములను బట్టిచూడ రాబోవుసమావేశము చాలముఖ్యమైనదని గన్పట్టకపోదు. అందువలన దేశీయులు అధిక సంఖ్యాకులిందు పాల్గొని విద్యావిషయమున గల లోపములను ప్రకటించి, సంస్కరణముల గూర్చి ఆలోచింతురని కోరుచున్నాము

## ప్లేగువ్యాధి: నివారణోపాయములు

ఈవత్సరము ప్లేగువ్యాధి నివారణమునకై మన ఆరోగ్యశాఖవారు సులకువత్తో పనిచేయుచున్నందులకెంతయు ప్రశంసనీయులు. గిరాంచికయందును, ఈసంచికయందును, మనఆరోగ్య శాఖవారు ప్రకటించిన విషయములను ప్రజలు గమనించెదరనియు, తిదానుసారము ఆచరించి తమకేగాక దేశమునకు గూడ మేలొనర్చెదరనియు మేమాశించుచున్నాము. ఈపాడు ప్లేగువలన ప్రతిసంవత్సరమెంత నష్టము కలుగుచున్నదో సర్వజన విదితమే. ఇపుడు ఆరోగ్యశాఖవారు ప్రజలకు సర్వవిధములతోడ్పడుటకు సంసిద్ధులైయున్నారు. కనుక ప్రజలీఅవకాశమును వినియోగించుకొననిచో వారికే హెచ్చు నష్టములు కలుగుననుటలో సందియమేమి!

ఇంతియగాక ప్రస్తుతము వ్యాపించుచున్న కలరా వ్యాధిని వారణమునకు ఆరోగ్యశాఖవారు దేశభాషలలో కరపత్రములు ప్రకటించ వలయును. కంటోన్మెంటు ఆరోగ్యశాఖవారివలె ప్రతినిధికి ఉపన్యాసముల నిప్పించ వలయును. అప్పుడు ప్రజలకు బాగుగ తెలిసి వ్యాధి తగులకుండ ప్రయత్నించెదరు. ప్రజలకు ఆరోగ్యవిషయములు తెలియనందున సాధారణముగ ప్లేగు,కలరా మున్నగు అంటు వ్యాధులు త్వరగ వ్యాపించుచున్నవి. కనుక వారికి వ్యాధి గూర్చి బాగుగ తెలియుటకును మూఢ విశ్వాసములకు లోబడి నష్టముల పాలుగాకుండు నట్లును, ఆరోగ్య శాఖాధికారులు బోధించవలయును. ఈవిషయమున ఆరోగ్యశాఖాధ్యక్షులు శ్రద్ధ వహించెదరుగాక!

### గమనించ దగిన విషయములు

౧. వ్యాధిసోకిన ప్రదేశములకు పోకుండ ప్రయత్నించుడు.

౨. వ్యాధియున్న స్థలమునుండి యెవరినైన మీయింటికేకాని నగరములోకేకాని రానివ్వకుడు.

౩. వ్యాధియున్న స్థలమునుండి యెవరైన వచ్చి నివసించినచో మీరు మహెల్లా ప్లేగు శాఖవారికే కాని సఫాయివారికే కాని తెలుప వలయును,

౪. మీ గృహములను, చుట్టు ప్రక్కలును, పరిశుభ్రముగ నుంచుడు. సఫాయివారు అశ్రద్ధ చేయుచున్న వెంటనే సఫాయి కమిష్నరు గారికి దెలుపుడు.

౫. భోజన పదార్థములపై ఎలుకలు తిరుగకుండు నట్లు మూతలు పెట్టుడు.

# ప్లేగువ్యాధి

### ఆరోగ్య శాఖాధ్యక్షుల ప్రకటన

౧౩౩౯ ఫ మహారేవరు నెల ౨౨ వ తేదిన సూర్తాళ్ బజారు నందు ఒక పిల్లవానికి, ప్లేగు సోకెను. ఇతడు వెంటనె అసుపత్రికి చేర్చబడెను. ఎలుకలు కూడ పడినవి. వానిని పరీక్షించగ ప్లేగు ఎలుకలని తేలినది.

ఈవ్యాధి నివారణకై దిగువ సూచనలు గావింప బడుచున్నవి:—

౧. ప్లేగు శాఖవారు ప్రతి మహెల్లాయందు ఎలుకల బట్టుటకై యేర్పాట్లు చేసియున్నారు. ప్రజలు వారికి తోడ్పడ వలయును.

౨. ఎలుకలు బడినను, లేక ప్లేగు సోకినను వెంటనె సఫాయివారికి, ప్లేగు శాఖకును తెలుప వలయును.

౩ పడిన ఎలుక గూర్చి అను మానమున్నచో అట్టి ఎలుకను ఒక టిన్ను పెట్టెలో వేసి మట్టి నూనె పోయవలయును. దీనిని ప్లేగు శాఖవారికె కాని సఫాయి వారికే కాని నివ్వవలయును. ఎలుకలు పడ్డచోట మట్టి నూనె చల్ల వలయును.

౪. బోనులో పట్టిన ఎలుకలను ప్లేగు శాఖవారి కివ్వ వలయును.

### ఇండ్లుఖాళీ చేయుట

౧. పస్తిని యందేని ప్లేగు వ్యాపించిన వెంటనె అఫీధివారు తమయిండ్లను ఖాళీచేసి దిగువ వ్రాసిన ౧౨ క్యాంపులలో యేదేని నొక క్యాంపునందుండ వలయును. ఇచట వారికి పర్దా, దీపములు మున్నగు సౌకర్యములు చేయబడును:—

దేవరి యూంసింగు, షాళిబ్లి, దిలావర్ గంజు, బహాదురుపురం, కిషన్ బాగు, ఈద్గా, హైదాబాదు అడ్డిగమెట్టు మషీరాబాదు,పంజగుట్ట (పాతది).పంజగుట్ట (క్రొత్తది)పంజగుట్ట (అర్థికశాఖ)

౨. ప్లేగు సోకినవారికి లింగపల్లి యందున్న ప్లేగు అసుపత్రిలో చికిత్స చేయబడును. ఈ అసుపత్రి యందు చెర్చుకొనబడిన రోగులు ప్రైవేటు డాక్టరులతో కూడ చికిత్స చేయించుకొన వచ్చును. మందులు, ఆహారము, బట్టలు, అసుపత్రియందే యియ్యబడును. లేక స్వంత డాక్టరులచే తెప్పించుకొన వచ్చును. అసుపత్రియందు జరిగిన లోపముగూర్చి మషీరాబాదు యందుండు ప్రత్యేక ప్లేగు అధికారికి తెల్పిన వారు సానుభూతితో విచారించెదరు.

### ప్లేగు టీకాలు

౧. వ్యాధి వ్యాపింపక మున్నె టీకాలు తీయించుకొనుడు. దీనివలన మీ ప్రాణములే గాక ఇతర వీధులవారి ప్రాణములు దక్కును.

౨. ప్రతి ప్రభుత్వ అసుపత్రియందు ప్లేగు టీకాల మందుండును. ప్లేగుశాఖ డాక్టరులు ప్రతి వీధి ప్రజలకు టీకాలు తీయుదురు. ఇండ్లలో తీయవలసి యున్న యీ డాక్టరులకు తెల్పిన వచ్చెదరు.

౩. గోషా స్త్రీలకొరకు విక్టోరియా జనానా అసుపత్రి యందలి స్త్రీడాక్టరులు టీకాలు తీయగలరు.

### వ్యాధి సోకకుండునట్లు జాగ్రత

౧. మీ గృహములశుభ్రముగనుంచుకొనుడు

౨. మీ గృహములలో ఎలుక బిలములున్న ప్లేగు శాఖవారికి దెలుపుడు

౩. మీ గృహములలో ఎలుకలు పడినచో ప్లేగు క్యాంపునకు పోవుడు.

## రెడ్డి వసతిగృహ వార్షికోత్సవము

రెడ్డివిద్యార్థి వసతిగృహ వార్షికోత్సవమును, రెడ్డి గ్రంథాలయ ప్రవేశోత్సవమును మహారాజా సర్ కిషన్‌ప్రసాదు బహద్దుర్ యమినుస్సల్తనత్ సదరె ఆజమ్‌గారి యాజమాన్యమున ఈ ౧౩౩౯ ఫసిలి ఆబాన్ నెల ౭,౮ తారీఖులలో [భాద్రపద బ॥ ౮,౯లు] జరుప బడును. ఆదే సమయమున రెడ్డిహాస్టలు యొక్కయు, రెడ్డిజన సంఘము యొక్కయు క్రొత్త ఎన్నికలు జరుగును. మరియు రెడ్డిజనసంఘ నిబంధనలు ఆమోదింప బడును. కావున రెడ్డిజనసంఘ సభ్యులగు మీరు తప్పక పై తారీఖులందు రెడ్డిహాస్టలునకు దయచేసి మమ్ము అనుగ్రహింతురని మనవి. సభ్యు లందరికిని భోజన వసతు లేర్పాటు చేయబడి యున్నవి. ఈ యుత్సవము రెడ్ల కందరికిని సంబంధించిన విషయము కావున ఎన్ని పను లున్నను తాము అవకాశము కలిగించుకొని తప్పక విచ్చేసి తమ జాత్యభిమానమును వెల్ల డింతురని కోరుచున్నాము. అనేక రెడ్డి సోదరులు విచ్చేయు చున్నారు.

ఇట్లు విధేయుడు,
జనరల్ సెక్రటరీ.

## స్థానిక వార్తలు

### నియామకము

భూవ్యాదాయశాఖ సంయుక్త కార్యదర్శి యగు నవాబు ఆగాయార్జంగు బహద్దురుకు బదులుగ కరీంనగరము అవ్వల్ తాలూక్దారులుగా నున్న శ్రీ రాఘవేంద్రరావు గారిని నియమించిరి.

### తగ్గింపు

ఉన్నత న్యాయస్థాన సేవదారులగు హిదాయతు అహమదుసా॥ బి. ఏ. ఎల్. ఎల్. బి ని కాజి మునీరొద్దీన్ సా॥ మున్సిఫు బదులుగా నియమించుటకును, వీరిని ఉన్నత న్యాయస్థాన సేవదారులుగా నియమించుటకును ఆజ్ఞయైనది.

### పిక్థాల్‌గారు

వీరు ప్రత్యేకసెలవుపై ఇంగ్లాండునందున్నారు. వీరు రౌండుటేబిల్ సభకు ఇచ్చటినుండి పోవు ప్రతినిధులతో పనిచేయుటకు అంగీకరింపబడినది.

### పూర్వపు ప్రధాన న్యాయమూర్తి

పూర్వపు ప్రధాన న్యాయమూర్తులగు నవాబు జుల్‌ఖదుజంగు బహద్దురు గత బుధవారము నాడు స్వర్గస్థులైరి. అందుచే ఆనాడు ఉన్నత న్యాయస్థానమునకు సెలవొసగ బడెను

### అలవెన్సు

వైద్య కళాశాల ప్రొఫెసరులగు డాక్టరు మార్గీకరు డాక్టరు అబ్దుర్రహమాన్ ఖాన్ గార్లకు నూరేసి రూప్యముల అలవెన్సు యొసగుట కాజ్ఞ యొసగబడినది.

### సెలవు

సుంకముశాఖ మదద్గారు మొహతమిములగు మౌల్వీ మహమ్మదు ముస్తఫాయారుఖాన్ సా॥ రెండునెలల యిరువదిమూడు రోజుల సెలవు గైకొనిరి.

గుల్బర్గా సెషన్సు జడ్జిలగు మౌల్వీ మీరుఅలంఅలీఖాన్ సా॥ ఆరునెలల ప్రత్యేకసెలవు గైకొనినందున క్రింది తాత్కాలిక నియామకములు జరిగెను.

(౧) ఔరంగాబాదు సదరు అదాలతు జాయింటు జాజిలగు అప్పారెడ్డిగారు గుల్బర్గా షషన్ జజ్ పై

(౨) మహబూబునగరము జిల్లా అదాలతు జాజంటుగు మౌల్వీ మీరు షౌకత్ అలీ ఖాన్ సా॥ ఔరంగాబాద జాయిటు షషన్ జజ్ పై

[౩] మహబూబునగరం జిల్లా నిజామతుపై సర్కారీ వకీలగు మౌల్వీ షుజాఉద్దీను సా॥

కవాయిదుశాఖ సహాయకార్యదర్శులగు మహమ్మద్ రఫీఖాన్ సా॥కు కంటిచికిత్స చేయించుకొనుటకై ౧ నెల ౨౨ దినములు సెలవు అంగీకరింప బడినది.

### శ్రావణ పక్ష

[illegible]

### ధనాప హరణము

అబ్కారి నిజామతుశాఖ సేవదారగు వెంకట రంగయ్య నాయుడుగారిని రు ౧౩౦౫౮ ధనాప హరణము గావించిన నేరముపై నగరరక్షక శాఖవారు నిర్బంధించిరి.

### స్వదేశీలీగ్

స్వదేశీ వస్తువులయందు జనులకు అభిరుచి గలిగించుటకై స్వదేశీలీగ్ అను నొక సంఘము స్థాపించబడినది. దీని శ్రీమతి పద్మజా నాయుడుగారు అధ్యక్షులు

### భారతదేశ సేనాధిపతిగారు

భారతదేశ సేనాధిపతులగు సర్ విలియం బర్డువుడ్ గత సోమవారము నాడు యిచ్చటికి విచ్చేసిరి. వీరి గౌరవార్థము ౧౭ తోపులు ప్రేల్చబడెను. వీరు మొన్న సికింద్రాబాదులోని ప్రేమ్రగౌండులో వివిధసేన శాఖలను విలోకించిరి. సైనిక వైద్యాలయమును గూడ చూచిరి. సాయంత్రమున ఫలకునుమా కేగిరి. నిన్న బేగంపేట ప్రేమ్రగౌండున కేగి పంజాబి రెజిమెంటు మొదలగువానిని చూచి ప్రభువుగారితో భోజనము చేసిరి. హుడుగ్హూములకు ఉస్మాన్ యారద్దౌలా మొదలగు సైన్యాధికారులతో తేనీరు పుచ్చుకొనిరి

నిన్న రాత్రి ప్రధాన మంత్రులగు మహారాజ సర్ కిషన్ ప్రసాదు బహద్దురుగారి దేవిడీలో భారతదేశ సేనాధిపతులగు సర్ విలియం బర్డువుడ్ గారికి గొప్ప విందొసగబడెను. ప్రభుత్వోద్యోగు లందరును విందునకు విచ్చేసిరి

### బూబెల్సు సంఘము

అయిదు వత్సరముల క్రింద స్థాపింపబడిన పైసంఘము వారు కొలదిరోజులలో ఒక నూతన ఇంగ్లీషు నాటకమును ప్రదర్శించనున్నారని తెలియుచున్నది.

### కత్తితో పొడచుట

చాదరుఘాటువద్ద డాక్టరు మిస్ డికోస్టాయను నామెను ఎడ్వర్డు డికోస్టాయను నాతడు కత్తిచే పొడిచెను. ఇందుచే చేతికి తీవ్రమైన గాయము తగిలెను. పోలీసు విచారణ సలుపుచున్నది.

### మరమ్మతులు

[illegible] తయారు చేయుటకుగాను బాగుకై [illegible] వరంగలు జిల్లా వెంకటాపురం [illegible] చేయుటకు రు. [illegible], చిన్నపిల్లారోడు సంవత్సర [illegible] రు. [illegible] హెచ్చువిచ్చుటకును ఉస్మానియా అసుపత్రికి బాగుచేయుటకు రు. [illegible] ఆదేఅసుపత్రియందు [illegible] చదరుఘాటు హైస్కూలు భవనములో కొంతభాగము హెచ్చించుటకై రు [illegible] అంగీకరింప బడినవి.

### మాలుశాఖాపరీక్ష

ఈపరీక్ష రాబోవు దైనెలలో జరుగునని ప్రకటింప బడినది.

### అమరచింత సంస్థానము

ఈ సంస్థానము కోర్టుఆఫ్ వార్డ్సునందు చేర్చ బడినది.

## ఉప్పువలనలాభ మేమి?

చొల్లేటి- నృసింహశర్మగారు

౧. పట్టు బట్టను ఉప్పువేసిన నీటిలో కొంతసేపు ఉంచి మీద అరవేసి ఇస్త్రీచేసిన గట్టిగాననగును.

౨. నీళ్లలో పిండినరంగు పోవునను భయము గల బట్టల ఉప్పు వేసిన వేడి నీటిలో నుంచి నీళ్లు చల్లపడిన పిదప శుభ్రపరచిన రంగు పోదు.

౩. నిమ్మరసములో ఉప్పువేసి త్రుప్పు పట్టిన వానిని తోమిన త్రుప్పుపోవును.

౪. చీనీ పాత్రనులపై ఊరుగాయ మరకలు పట్టిన ఉప్పునీటితో కడగ వలెను.

౫. నిప్పు వలన నెచ్చటనైన కాలినను, తేలు మొదలగు విషజంతువులు కుట్టినను, ఉప్పునకొద్దిగా తడిపి పట్టీవేసిన విష నివారణయగును.

౬. గుడ్డలపై సిరాపడిన నాచోటు ఉప్పు నీటిలో కొంతసేపు ఉంచి శుభ్రపరచిన మరకలుండవు.

౭. చల్లని నీళ్లలో ఉప్పువేసి త్రాగిన డొక్కనొప్పి, కడుపునొప్పి తగ్గును, అన్నము జీర్ణమగును.

౮. బొగ్గుపొడిలో ఉప్పు కలిపి పండ్లు తోముకొనిన పండ్లు మల్లెపువ్వులవలె తెల్లగానగును,నోటి దుర్వాసనను బోగొట్టును.

౯. సైంధలవణమును చింతపండులో గాని శొంఠిపొడిలో గాని కలిపి తినిన పిత్తవికారముల దూరపరచును.

౧౦. మోమ్ బత్తిని తెల్లగా చేయవలె నన్న పసికడుగులో ఉప్పు కలిపి అందు కొంతసేపుంచి గంధకపు తేజాబుతో కడిగిన తెల్లనగును.

౧౧. ఉప్పు ఆహారమును రుచికరముగా నే యును.

౧౨. ఉప్పువల్ల మంచి రక్తము తయారగును.

౧౩. వేడినీటిలో ఉప్పు వేసి త్రాగిన ఒకటి రెండుతూర్లు పాచనమగును.

౧౪. పసుపులో ఉప్పు పెరుగు కలిపి త్రోస్సకు పట్టించిన దుర్వాసన రాక మెత్తపడును.

౧౫. మృతకళేబరములు మురగకుంటకై తురుకలు గోరీలలో వేయుదురు.

౧౬. నాలుక చేరులు వచ్చిన పశువుల నాలుకపై వ్రాసిన విరిగి తగ్గును.

౧౭. వేడిఉప్పు కాపి- కట్టిన- కళ్లినొప్పులు వాతనొప్పులు తగ్గును.

### అతియాతు విచారణ

కొన్ని సంవత్సరముల క్రింద జాగీరాతులలో గల ఆతాయి సల్తానిమాషు విచారణ ఖాన్యా వారె చేయవలయునని ప్రభువుగారు ప్రకటించి యుండిరి. తదానుసార మింత వరకు జరుగుచుండెను. కాని కొందరు పెద్ద జాగీర్దారుల సూచనపై మరల ప్రభుత్వసభవా రాలోచనచేసి ప్రభువుగారివద్దకు పంపిరి. జాగీరాతువందున్న మాషు జాగీర్దారులే విచారణ చేయవచ్చుననియు దీనిపై అతియాత్ శాఖలో మారాఫా చేయవచ్చునని ప్రభువుగారు ఫర్మానా జారీచేసిరి. కాని అతియాత్ శాఖాధికారులు దీనివలన జాగీర్దారులు మాషుదారులకు నష్టము కలిగించెదరని తమపై అధికారులకు తెలిపిరి. ప్రిన్స్‌గారు ఫర్మానామును నిలిపియుంచిరి. కాని ఫర్మాను అచరణమం దుంచవలయునని మరల పకటింపబడినది? ఇకముందు జాగీర్దారులే తమ తమ జాగీరుల అతాయి సుల్తాని మాషుగూర్చి విచారణ సలిపెదరు.

అహింసాసత్యాస్తేయ బ్రహ్మచర్యా పరిగ్రహాయమా॥ శౌచసంతోష తపః స్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః॥౩౦।౩౨॥ పాతంజలియోగదర్శనము ४ ఆర్యులు మాంసాహారులనుటకు పశుమేధ సోమపానములు ప్రమాణములట! పశుమేధమనగా గోమేధా శ్వమేధములైనచో వానియర్థముకే తెలిసికొనక వారట్లు వ్రాసియుందురని మనవి చేయుచున్నాము వినుడు

"అన్నగ్ం హిగో॥ శతపథము ४।౩।౧।౨౫। అన్నము నగ్నిలోవైచి చేయు హోమమునకు గోమేధమనిపేరు చూడుడు సత్యార్థప్రకాశము ౧౧వ సముల్లాసము

"రాష్ట్రంవా అశ్వమేధః" శతపథము౧౩।౧।౬।౩। అగ్నిర్వాఅశ్వః। అజ్యంమేధః॥ శతపథబ్రాహ్మణే॥ రాజ్యపాలనము అజ్యహోమము వీనికి అశ్వమేధమని పేరు సత్యా ౧౧ సముల్లాసము ఇక సోమపానము సురాపానమనుట పాలను మాంసమనుటయే!

వీనినిబట్టి వైదికులగు ఆర్యులను మాంసాహారులనుటయెంత సత్యదూరమో వేఱుగ వ్రాయ నవసరములేదు

౫. ఉత్తరము పైన వ్రాయబడినది

౬. అప్రమాణములచేతనే యార్యులు గోహోహారులనియు సురాపాననిరతులనియు తెల్లముకాగలదు

౭ ప్రమాణరహితము శూద్రాదికబ్దవాచ్యత కలుగుటకు కారణములు పైన చూపబడినవి

౮ చరిత్రజ్ఞులు వీతత్సత్యమును గ్రహింపకపోరు హిరణ్యకశిపుడు నిరీశ్వరుడుకాగా ప్రహ్లాదుడువిష్ణువు (ప్రవేష్టివ్యాప్నోతి చరాచరం జగత్ సవిష్ణుః) ను సాక్షాత్కరింపబూనుటచే వైష్ణవ భేద ప్రసక్తి యెట్లగునో తెలియకున్నది భాగవతమును జూచినచో ప్రహ్లాదుడెట్టి యద్వైత సిద్ధాంతము నుపదేశించెనో తెలియగలదు.

౯. కలగూరగంప చేసిరనుటకు ప్రమాణము లేమియో తెలుపలేను. ఇక ననార్యులకు (శూద్రాదులకు) వేదాధ్యయనార్హత గలదో లేదో యీ క్రింది మంత్రమే సాక్ష్యమిచ్చును.

యథేమాం వాచం కల్యాణీ మావదానిజనేభ్యః బ్రహ్మ రాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయచ స్వాయచారణాయ॥ యజు ౨౬।౨॥

ఈ కల్యాణకారియగు వాణిని బ్రాహ్మణ క్షత్రియ వైశ్య, శూద్ర చారణులను సర్వజనుల కొఱకును చెప్పితిని.

౧౦. ఈ వాక్యముల పరస్పర వైరుధ్యమును వేఱుగ జూప నక్కఱలేదు.

౧౧ అనార్యభూషిత భాగము లందలి కనుపడినను స్వాములవారి కన్నుల కనుపడకుండుట విచారణీయము! చూడుడు:—

నమస్తక్షభ్యోరథకారే భ్యశ్చవోనమోనమః కులాలేభ్యః కర్మారేభ్యశ్చవోనమో నమోనిషాదేభ్యః పుంజిష్ఠేభ్యశ్చవోనమోనమః శ్వనిభ్యో మృగయుభ్యశ్చవో నమః॥

యజుర్వేదము అ. ౧౬।౨౭॥

మహీధరభాష్యము:—

తక్షాణః శిల్పజాతయేభ్యోనమః। రథంకుర్వన్తి రథకారాః సూత్రధార విశేషాస్తేభ్యోనమః। కులాలాః కుంభకారాస్తేభ్యోనమః। కర్మారా లోహకారాస్తే భ్యోనమః। నిషాదాగిరిచరామాంసాశనోభిల్లాస్తేభ్యోనమః। శునోనయంతి తేశ్వన్యః తేభ్యోనమః। మృగాన్ మారయన్తితే మృగయవః... తేభ్యోనమః॥

ఋచంనో ధేహి బ్రాహ్మణేషు ఋచంరాజసునస్కృధి॥ ఋచంవిశ్యేషు శూద్రేషు మయిధేహి ఋచారుచమ్ ॥४౮॥ తైత్తిరీయ సంహిత ౫।౭।౬

శు. యజుర్వేదము ౧౮।४४।

"బ్రాహ్మణ క్షత్రియ వైశ్య, శూద్రులలోను నాయందును తేజమునుంచుము"

౧౨. ప్రతి హిందూ మాత్రునికిని యీ విషయమును వేఱుగచెప్ప నక్కఱలేదు

తుదికి వినయముతో నే జెప్పునదేమన పంచముల చరిత్రయను పుస్తకము నిజముగ స్వాములవారిచేతనే రచియింపబడెనాయను సంశయము కలుగుచున్నది ఎందుకనగా ౧౩ పుటలలో నివిషయములు కన్పట్టి నప్పుడు పుస్తకమునందంతయు నెట్టివిషయములున్నవో యోచింపుడు ఇంతకు నేనన్ప్రక్యతా వివారణ నొప్పుకొననని గానుఈవిషయమున శ్రీయుత శ్రీపాదదామోదర సాతవళేకర్ గారను నొక గొప్ప పండితుడు (సామవేద) భాష్యకర్త చాల గొప్ప గ్రంధమును వ్రాసియున్నాడు కనుక మా పుస్తకము తెనుగున బయల్వెడలినచో నాంధ్రదేశీయులకు చాలా లాభము గలుగగలదని నమ్ముచున్నాను లేక ఈ పంచములచరిత్రను అపుస్తకమును బాగుగా జదివినపిదప సంస్కరించి ముద్రింపించినను కొంతవఱకు మేలేయగును మొదట నీ గ్రంధమును నిర్లక్ష్యముతో డనే జూడనెంచితిని కాని యిదియొక పరమహంసపరివ్రాజకార్యులపేరుతో ముద్రింపబడియున్నందున నింతవఱకు వ్రాయవలసివచ్చినది తగినవార లీవిషయమునకు యింతకన్న నెక్కుడు ప్రామాణిక గ్రంథమును బ్రకటింతురుగాక! ముఖ్యముగ నీ విషయమున ననుభవజ్ఞులగు శ్రీయుత సురవరము ప్రతాపరెడ్డి గారీ పనికిబూనినబాగుండునని నమ్ముచున్నాను ఇతిశమ్

[వేం॰ రా॰ అ]

---

## కళావంతుల సంస్కరణ సంఘము.

---

### దేశీయులకు విన్నపము.

---

### బాల్కొండ ప్రచారము.

జూలై నెలతుదను నిజామాబాదుజిల్లా బాల్కొండ గ్రామమునకు మంగళగిరి రాఘవయ్యగారు ప్రచారమునకై వెళ్ళియుండిరి సప్తాహ సందర్భమున ఇతర గ్రామములనుండి వచ్చినట్టియు, ఆగ్రామముయొక్కయు ప్రజలయెదుట భోగము మేళములవలన కలుగుచేటు మున్నగు విషయములగూర్చి ముచ్చటించిరి ఆగ్రామమునందలి వ్యభిచారమే కులవృత్తిగాగలవారి యిండ్లకు వెడలి దానివలన కలుగుచున్న దోషములు విపులముగ జెప్పిరి.

### సాంఘికస్థితి

ఒకజాతివారిలో వ్యభిచారమునకై కొంతమంది సంఘముగా నేర్పరచుట యెట్లు హిందూ సంఘమున ఆచారమో ఆశ్చర్యము గొలుపుచున్నది ముఖ్యముగా ఈ సాంఘికులలో బాలికలను వివాహము చేయుటయనది యెరుగకపోవుటచే తమ బాలికలను వివాహితులుగా జేయనెంచినను చేసికొనువారెవరని శంకించుచున్నారు ఇతర జాతులవారు తమ పిల్లలను యీ జాతి పురుషులకిచ్చుటయేగాని వీరి బాలికలను రెన్నడును వివాహమునకై తీసికొని యెరుగరు కులటలయొక్క బాలికలను సాంసారిక కుటుంబములలోనికి తీసికొనుట తగనిదనుచున్నారు ఈ సమస్య వారికి బహుక్లిష్టముగా నున్నను యింతకు శ్రమచేత సమపాయము చేకూరక మానదు సాంఘీయులలో యీ హీనవృత్తియందు రోత పుట్టింపుగలిగినచో 'త్యాగమానిస్వస్తి' జెప్పుటకు సెనుకొను చున్నారు దురభ్యాసములయందు అలవాటు పడుటచేత నొక్క సారిగా నెరవేయ సాధ్యముగాదు అయినను ప్రయత్నముచే సాధింపవచ్చును

### సంస్కరణ ముఖ్యవిధులు

1. బాలికలకు వివాహమొనర్చుట
2. బాలురకు విద్య యితర వృత్తులయందు చేర్చుట
3. పురుషులు యితర వృత్తులచే దమ జీవితమును గడుపుట
4. స్త్రీలు సాని మేళములలో పాల్గొనక నీతిబాహ్యమయిన జీవితమునుండి తొలంగుటకు ప్రయత్నించుట

### విన్నపము

సాంఘిక సంస్కరణమునకు ప్రచారము ముఖ్యావశ్యకము. బహిరంగోపన్యాసములకన్న సాంఘీయుల గృహములకు వెడలి పలుసారులు ప్రచారము చేయుచుండినగాని ఫలితము కలుగదు. ప్రచారమునకు ద్రవ్యము ముఖ్యావశ్యకము ద్రవ్యసహాయము లేక ప్రచారము సాగించుట కష్టముగనున్నది. ఈసాంఘిక దోషములు అన్ని సంఘములను బాధించుచున్నవి. కావున సంస్కరణ సంఘమునకు మీరెల్లరు యుచిత రీతిని సహాయము చేయుటకై ప్రార్థించుచున్నాము

యస్. శ్యామరావు
మంగళగిరి వీరరాఘవయ్య

---

## మీరు చదివినారా?

| | |
|---|---|
| ౧ రెడ్డికుల నిర్ణయచంద్రిక | ౧-౪-౦ |
| ౨ సంఘోద్ధరణము | ౦-౮-౦ |
| 3 పంచముల చరిత్ర | ౦-౫-౦ |
| ౪ భారతీయ స్త్రీ ధర్మములు | ౦-౫-౦ |

లేకున్న నేడే తెప్పించుకొనుడు.

ఈ నాలుగు గ్రంథములు ఒకేసారి తెప్పించుకొనువారికి ౧ తిప్పన్న చరిత్రము ౨ జీజికంటి రామశతకము 3 బమ్మెర పోతనామాత్య విజయము ౪ క్షయవ్యాధి ౫ కష్టాలహరి మొత్తము ఒక రూపాయి పుస్తకములుచితముగ నివ్వబడును. తపాల ఖర్చులు వేరు.

గోలకొండ పత్రికా కార్యాలయము
తూర్పు బజారు హైదరాబాదు (దక్కన్)



## గోలకొండ పత్రిక

### ఏజంట్లు

హైదరాబాదు

1 బి. ఎస్. సెట్టి అండు కో రెసిడెన్సీబజారు
2 నా. గౌరీశంకరవర్మ ,,
3 కాళిదాసు బి పురోహిత్ ,,
4 డి. యం. మెహతా షహ్రను మసీదు ఎదుట } గోలిగూడ

సికింద్రాబాదు

1 మట్వారి నారాయణ మార్కెటు బజారు.





గోలకొండ పత్రిక
తూర్పు బజారు హైదరాబాదు దక్కన్.
సంవత్సరము చందా
రు. ౭-౦-౦
అర్థ ,, ౩-౧౨-౦
విడి పత్రిక ౦-౧-౪

Printed and Published by G. Ramakrishna Reddy at Golkonda Power Press, Hyderabad, Dn. Editor K. Balakrishna Reddy